# మహామానవులు

## (కొద్దిమంది జిజ్ఞాసుల పరిచయాలు)













గౌరవ్

## ఉన్నతికి మూలం ఉనికిలో ఉద్దేశమే.

సామాజికమాధ్యమాల్లో అప్పుడప్పుడు చేసిన కొద్దిమంది మహామహుల నామమాత్రపు పరిచయాలే ఇవి. ఈసరికే ఈ క్రమంలో కొన్ని వర్క్స్ వచ్చాయి. ఐతే, భావజాల పరంగా వీటికో ప్రత్యేకత ఉంది. భారత ఉప ఖండంలో జరిగిన విభిన్న తాత్విక చింతనల ప్రవంతిని లోతుగా అనుసరించిన వ్యక్తిత్వాల చరిత్రను ఇందులో మిళితం చేయగల గడం. ఐతే, అంతమాత్రంలో ఇదేదో సమగ్రత సంతరించుకుంద నుకుంటే పొరపాటే.

ప్రత్యామ్నాయ సామాజిక రాజకీయ సాంస్కృతిక ప్రవంతిని బలోపేతం చేయ డానికి కృషి చేసిన కొందరి పరిచయానికి మాత్రమే ఈ కృతి పరిమితం. అందులోనూ ఇది రచనా వ్యాసంగంకోసం చేసింది కాదు కావున లోటు పాట్లు ఉంటాయి. వివిధ సందర్భాలలో కూర్చిన ఈ వ్యాసాల్లోని అంశాలను గురించి సమచార సేకరణకు సంప్రదించిన మూలాల్ని కూడా ఇవ్వలేకపోడానికి ఇదే కారణం. అందుకు నిజాయితీగా క్షంతవ్యుడ్ని.

జ్ఞాన సూత్రం శోధనైతే అజ్ఞా నానికి అసూయ. దానిని తప్పించి ఆలోచించ డానికి ప్రయత్నిస్తే లోకహితం బోధ పడుతుంది. అవిశ్రాం తంగా తిరిగే కాలచక్రంలో నిరాశ్ర యులుగా నిలిచిన కొద్దిమంది ఎన్నడూ ఎదురీద డానికే చూసారు.వారి వీర త్యాగాల్ని, దీనగాథల్ని గుండెల్లో నింపుకుని ముందు కెళ్ళడం మనందరి కనీస కర్తవ్యం. అందులో భాగంగా ఎప్పటి కప్పుడు పనికట్టుకుని పరిచయం చేసిన వ్యక్తులు,ఈ మహామనుషులు.

ఒక ప్రజాస్వామిక ప్రేమైక సమాజాన్ని కాంక్షిస్తూ ఆ దిశగా అడుగులు వేస్తూన్న అభివ్యక్తి ఇది.రూపంలో, సారంలో భిన్నాభిప్రాయాల్ని గౌరవించే వైఖరి ఇందుకు ప్రధానం. అన్నిరకాల వివక్షత నుంచి సాధించాల్సిన విముక్తమార్గం మానవాళి చిరకాల వాంఛ. అందుకోసరం జరిగే మేధో మధనాలు, మానసిక మంత నాలు అన్నీ ఈ పరిధి లోనివే. ఎందుకంటే, మనిషి ఉన్నతి కోసం ఉద్దేశించిన కార్యక్రమం అదేదైనా మహోన్నతమైనదే.

# అంకితం




స్వాతంత్ర్య సమరయోధురాలు, సంవిధాన సభ సభ్యురాలు, మానవీయ చింతనాశీలి, సామాజిక కార్యకర్త, గొప్ప ఆలోచనాపరురాలు, రాజకీయ నేత, న్యాయవాద , పరిపాలక నిపుణురాలు, ప్రజాపక్ష మేధావి, రచయిత్రి, అనేక ప్రజాభ్యుదయ స్త్రీ సంక్షేమ సంస్థల రూపశిల్పి, వ్యవస్థాప కురాలు, జనహితకార్యక్రమాల కర్త మరెన్నో ఐన **'దుర్గాబాయి దేశ్‌ముఖ్'** 115 వ జయంతి సందర్భంగా ఆమె అవిస్మరణీయ అసాధారణ ప్రేరణకి ...

# మానవత్వమే మనిషి ఆధ్యాత్మికత !

‘థిచ్ నాథ్ హించ్’. !!

(ఒక మహత్తర పురోగామి పరిచయం)



“వియత్నాంలో ఉన్న నా శిష్యుడు నేను చనిపోయాక ఒక స్మారక స్థూపం కడతానని అన్నాడు. దాని మీద నా ఆత్మీయులంతా కల్సి”ఇక్కడ మా అందరకీ అత్యంత ప్రియ మైన గురువుగారు విశ్రమించారు.” అని రాస్తా రట. నేను వాళ్ళకి ఆరామం లోని స్థలం వృధా చెయ్యొద్దని చెప్పాను. ఐనా,పట్టుదల గా వాళ్ళు కనుక స్థూపం నిర్మించదలిస్తే, దాని మీద “నేను ఇక్కడ లేను.” అని రాయ మని చెప్పాను. అప్పటికీ చూసేవారికి అర్ధం కాదను కుంటే,”నేను ఎక్కడా కూడా లేను” అని రాయమన్నాను. ప్రజలకు ఇంకా అర్ధం కాకపోతే చివరగా మూడో వాక్యం రాయ మన్నాను,” బహుశా నేను మీరు పీల్చే శ్వాస లోనూ, నడిచే దారిలోనూ ఉంటానేమో.”

థిచ్ నాథ్ హించ్. ఒక స్వాప్నికుడు, ఒక ప్రేమి కుడు, ఒక బౌద్ధ భిక్షువు, యుద్ధ వ్యతిరేకి. ఒక అన్వేషి, నిరం తర గవేషి, ఒక తత్వవేత్త, ఒక శాస్త్రవేత్త.మేధావి, రచయిత, ఒకప్రవాసి, అంతే ప్రవాహి. భారతీయ బౌద్ధ దార్శనికతకి తనదైన ఆధ్యాత్మిక మానవతా సందేశాన్ని ప్రయోగాత్మక నమూనాల ద్వారా జోడించిన అరుదైన వ్యక్తి.ప్రపంచంలోని అనేక దేశాలలో ప్రశాంతమైన జీవన విధానాన్ని ప్రసాదించడం కోసం కాళ్ళలో చక్రాలేసుకుని తిరిగిన మహా శక్తి. ఎన్నో దేశాలు ఆయన్ని గౌరవించగా, మరెన్నో దేశాలు బహిష్కరించాయ్. కానీ, మొత్తంగా ‘భక్తి’కీ, ‘ఆధ్యా త్మికత’కీ ‘సేవా తత్పరత’నీ, ‘సామాజిక భాధ్యత’నీ కలగలిపి థిచ్ నాథ్ హెంచ్ ప్రచారం చేసిన “ఎంగేజ్ డ్ బుద్ధిజం” ప్రపంచంలోని వివేకవంతుడైన ప్రతీ మనిషినీ కదిలించే మహోన్నత సిద్ధాంతం !

ప్రపంచ ప్రఖ్యాత సామాజిక మత కార్యకర్త, ఆలోచనా పరుడు మార్టిన్ లూథర్ కింగ్ నోబెల్ శాంతి బహుమతికి థిచ్ నాథ్ హించ్ పేరుని సూచిస్తూ,”విశ్వ మానవ సౌభ్రా తృత్వం కోసం శాంతి, సమైక్యతల కోసం పనిచేస్తున్న ఈ వియత్నాం భిక్షువు కంటే ఈ పురస్కా రానికి అర్హతగల వారెవరూ నాకు తెలియదు” అన్నా డట. అసంఖ్యాక విశిష్టత లను కలిగి కూడా అత్యంత సామాన్యంగా, నిరాడంబరంగా జీవించడం ద్వారా మానవ

జీవన విధానంలోని సారాన్ని ఆచరణ ద్వారా మాత్రమే బోధించడానికి ప్రయత్నిం చిన సన్యాసి థిచ్ నాథ్ హించ్.సరిగ్గా 60 ఏళ్ళ క్రితం 1964లో ఆయన స్థాపించిన School of Youth for Social Service(SYSS) యుద్ధం బారిన పడిన గ్రామా ల్లో విద్యావైద్య సేవల్ని క్షేత్ర స్థాయిలో ప్రజల దరికి చేర్చడం కోసం అక్షరాలా 10,000 మందికి పైగా స్వచ్ఛంద సేవా కార్యకర్తలు చేరారనంటే ఆధ్యాత్మికతని భావోద్వేగాలు రెచ్చగొట్టడానికి కాక సామాజిక కార్యాచరణ కు థిచ్ మిళితం చేసిన తీరు అబ్బురమనిపిస్తుంది !

అందుకే, ఒకచోట మాట్లాడుతూ, "మనుష లెవరూ మరో మనిషికి శత్రువులు కాదు. మన నిజమైన శత్రువులు, 'కోపం, ద్వేషం, వివక్ష, వివేకరాహిత్యం, హింస, అపా ర్థాలు' మాత్రమే." అంటారాయన. బౌద్ధాన్ని నవ్య మానవతా విలువలకు అన్వయించి, వివక్షత కు వ్యతిరే కంగా నిలిచిన ఇద్దరు విలక్షణ వ్యక్తులుగా థిచ్ నాథ్ హించ్ నూ, డా. బి. ఆర్.అంబేద్కర్ నూ పేర్కొంటారు. భారతీయ చింతనాత్మక వైఖరికి తిరుగులేని వైజ్ఞానిక మానవీయ మాధ్యమంగా, జిజ్ఞాసా త్మక హేతుబద్ధ వివేచనకి,ఎదురు లేని తాత్విక ప్రాపంచిక దృక్పథంగా బౌద్ధాన్ని అత్యున్నత అద్వితీయ నిర్మాణ సౌధంగా మల్చడానికి గానూ, ఆధునిక కాలంలో కృషి చేసిన వారి లో థిచ్ నాథ్ హించ్ పేరుని తప్పక చేర్చాలి. జన్మస్థలానికి 40 ఏళ్ళు దూరంగా ఉండి నిరంతర సంచారిగా, అవిశ్రాంత ప్రచారిగా ఉంటూ కూడా ఎన్నెన్నో పురోగామి సంఘాలు స్థాపించి, పలు భాషల్లో వందకి పైబడిన అపూర్వమైన గ్రంథాలను రచించి, ఫ్రాన్స్‌లో plum village పేరిట ఆదర్శ గ్రామాన్ని నిర్మించీ, లక్షలాది మందిని మను షులుగా మల్చిన థిచ్ తన 95 వ ఏట రెండేళ్ళ క్రితం ఇదే రోజు, జనవరి 22, 2022 న మరణించాడు !

(మహాత్మా గాంధీ, నెల్సన్ మండేలా మొదటి శాంతి పురస్కారం అందుకోడం మొదలుకొని మన దేశంతో కూడా ఎంతో అనుబంధం ఉన్న థిచ్ నాథ్ హించ్ కి తెలుగు భావోద్యమాలతో ఒక పరోక్ష సంబంధం ఉంది. వియత్నాం నుండి ఆయన బహిష్కరించబడ్డాక ఫ్రాన్స్ లో తాను చేసిన ప్రయోగాత్మక విధానాల కోసం పలు దేశాల్లో కార్యశాలలు (వర్క్‌షాప్‌లు) నిర్వహించాడు. అలా చెన్నైలో పెట్టిన కార్య క్రమానికి అనుకోకుండా హాజరైన వ్యక్తే తరువాతి కాలంలో తెలుగు బౌద్ధ సారస్వ తానికి ఎనలేని కృషి చేసి బుద్ధ ఘోషుడి గా పేరొందిన అన్నపు రెడ్డి వెంకటేశ్వరరెడ్డి గారు. సుమారు పదేళ్ళ క్రితం ఆయన్ని ఇంటర్వ్యూ చేసినప్పుడు ఆయన స్వయంగా చెప్పిన ఈ విషయం ఇప్ప టికీ నాకు గుర్తుంది. అప్పుడు ప్రచురించిన 'సద్ధమ్మ స్వరాలు'(కొందరు బౌద్ధ ఉ ద్యమకారుల ఇంటర్వ్యూలు) పుస్తకంలో కూడా రికార్డైంది. థిచ్ అభిప్రాయాలు అన్నిటి తోనూ నాకు ఏకీభావం లేక పోవచ్చు కానీ వర్తమాన కాలంలో ఆయన ఆకాంక్షించిన

సామాజిక దృష్టికోణం అత్యవ సరమని నా భావన. ఆసక్తి ఉన్న వారి కోసం ఆయన రచనలూ, వీడియోలు నెట్లో ఉన్నాయి, చూడొచ్చు. కుళ్ళు, కుతంత్రాల జడిలో కూడా చివరి వరకూ మనిషి పక్షాన నిలబడి మంచి నీ, మానవత్వాన్ని ఎలుగెత్తి చాటిన మహో న్నత మానవతామూర్తికి, ఆయన వర్ధంతి సందర్భం గా చిరునివాళిగా ఈ చిన్న రైటప్ !)

–



# కవిత్వాన్ని,తాత్వికతనీ మేళవించిన వ్యక్తి !

## మానవతావాద మహాకవి: జాన్ ఎలియా

## (ఒక అవిశ్రాంత అక్షరాన్వేషకుడి స్మృతిలో...)




జీవితాంతం ఒంటరి జీవిగా బతికిన ఒక భావుకుడు. తన తో సమానస్థాయి కలిగిన సహ చర్యం కోసం అన్ని దిక్కులూ వెతికి వేసారి అక్షరాలకి బానిస యిన అరుదైన మనిషి. ఉర్దూ, అరబిక్, హిబ్రు, పర్షియన్, హిందీ, ఇంగ్లీష్, ఫ్రెంచ్ తదితర భాషల్నీ, వాటి మూలాల్నీ, ఆయా సాహి త్యాల్నీ ఆబగా తాగేసిన ఓ బక్కపల్చని దేహ మున్న స్వాప్నికుడు. మతాన్ని, మార్క్సి జాన్ని సమన్వయం చేయగల దార్శనికుడు. కమ్యూనిస్ట్, అనార్కిస్ట్, నిహిలిస్ట్ కవిగా ప్రపంచంలో గుర్తించబడ్డ ఏకైక భారతీయ కవి. ఈనేల మీద పుట్టి పాకి స్తాన్ కవిగా మల్చబడి దేశ దేశాల్లో తన స్వరం వినిపించి నవాడు. జీవితాన్నే కవిత్వాన్వే షణలో కరిగించుకున్న మహాకవి, ఎలియా, జాన్ ఎలియా !

ఏం చేసినా సంచలనం కలి గించే వ్యక్తులూ, ఏదిరాసినా మనసుల్ని కదిలించే శక్తిగల వారి కోవలోకి వచ్చే మొట్ట మొదటి వ్యక్తి జాన్ ఎలియా. జీవితం, స్నేహం, ప్రేమ, బాధ, ఒంటరితనం అన్నటినీ ఇముడ్చుకున్న ఆయన జీవితం దానికదే విశిష్టత కలిగిన విలక్షణ చక్రం. ఈ దేశంలో పుట్టి, పాకిస్తాన్‌కి వలసపోయి, రెండుదేశాల్లోనూ తన భావో ద్వేగాల బాంధవ్యాల్ని పదిల పర్చిన ప్రయా ణికుడు. ఉర్దూ సాహితీ జగత్తు లో కొత్త పదాల్ని, పదబంధాల్ని కూడా సృష్టించ గలిగిన తిరుగు లేని ఆగామి కవి !

పదేళ్ళ క్రితం డా. ఆవంత్స సోమసుందర్ తన 'ఉర్దూ సాహిత్యంలో ఉన్నత శిఖ రాలు' రచనలో చిట్టచివర్న, "నిర్బంధాగ్నుల్లో పాకిస్తాన్ విప్లవ కవి" అంటూ ఐదు పేజీలు జాన్ కోసం రాసారు. దాదాపు రెండు దశా బ్దాలుగా యూ.పి.లోని అమ్రోహాలో ఇప్పటికీ ఉన్న ఆయన జన్మ స్థలాన్నీ, ఇంటినీ సంద ర్శించాలనేది నా కల. ఎప్పుడు అనుకున్నా ఢిల్లీ వరకూ వెళ్ళి పని చూసుకుని వచ్చే యడమే కానీ కుదిరేది కాదు. అలాంటిది ఒక అను కోని కాంటాక్ట్ ద్వారా ఈ రోజా మాసం అందించిన బహుమతి అమ్రోహా వెళ్ళడం. అమ్రోహా చిన్న ఊరు కాదు. ఒక చారిత్రక ప్రదేశం !

డెబ్భై శాతానికి పైబడి ముస్లిం లు ఉండే ఈ ఊర్లో ప్రపంచంలో ఎక్కడా లేని విధంగా 72 ఇమామ్ బాడాలు ఉన్నాయి. పదుల సంఖ్య లో మసీదులు, దర్గాలు, గతకాలపు చరిత్ర ఆనవాళ్ళు ఒకటేమిటి, వాహ్! అనిపించే చరిత్ర. 1857 పోరాటంలో అమరులైన




వారి స్మృతులు ఇంకా ఉన్నాయి. స్వాతంత్ర్యో ద్యమంలో సాంప్రదాయ బుర ఖాని కాదని మహాత్మా గాంధీ బీ అమ్మ గా పిల్చుకున్న ఆలీ సోదరుల తల్లి అబాదీ బానో బేగం సరిగ్గా వంద సంవత్సరాల క్రితం ఇక్కడే పుట్టారు. గాంధీ టోపి రూపకర్త ఆమె. తన ఉపన్యాసాలతో, ఉద్యమ చైతన్యంతో ఎంతో మందిని ముందుకు నడిపిన ధీశాలి !

అమ్రోహ గురించి ఇలా చెప్పు కుంటే అంతే లేదు. ఆసక్తి ఉన్న వారికోసం అంతర్జాలంలో అంతులేనంత సమాచారం ఉంది, చూడొచ్చు. అలా కొంత ప్రయత్నం చేయగా సాహిల్ ఫరూక్ అనే యువకుడు,విద్యార్థి పరిచయం అయ్యాడు. ఉత్సాహవంతుడు. తన ద్వారా ప్లాన్ చేస్కున్న ప్రయాణం. నిజంగా ఎంతో తృప్తినిచ్చింది. ఎన్నో గజల్స్‌ని నా మదిలో ఉ బి కించిన జాన్ స్మృతుల్ని చూడటం, పెద్దా యన నేహాల్ అమ్రోహి నోటి నుండి 'గౌరవ్ సాబ్' అంటూ ప్రేమగా ఎలియా గజల్స్ వినడం మరచిపోలేని అనుభూతి !

రంజాన్ మాసంలో రోజా ఉప వాసం ఉండి కూడా రోజంతా నాతో తిరిగి అమ్రోహ యొక్క అంతరాత్మని దర్శింప జేసిన విద్యార్థి ఫరుక్ అమ్రోహి కీ, అతని మిత్రులకి, అక్కడ ఆప్యాయంగా ఆదరించిన అందరికీ ఎన్ని కృతజ్ఞతలు చెప్పినా తక్కువే. నాస్తికుడిగా ఉండి కూడా హిందూ, ముస్లిం ఐక్యాతా నినాదాన్ని ఎత్తి పట్టిన జాన్ ఎలియా సాక్షిగా మతోన్మాదం విద్వేషంతో పెచ్చురిల్లుతున్న వేళ, గంగా జమున సంస్కృతికి నిలువు టద్దంలా నిల్చిన అమ్రోహాకి అమలిన ప్రేమతో ఉగాది శుభాకాంక్షలు తెలుపుతూ, ఈ చిన్న రైటప్ !



# ఆధ్యాత్మికతంటే ఆంతరిక విప్లవమే !

## మానవోద్యమకారుడు స్వామి మన్మథన్
## (నిరంతర కర్మే నేను చేసే తపస్సు !)

"మన విప్లవం భావాల మీద ఆధారపడేది
భావాలను హత్య చేయడం అసాధ్యం !"

– స్వామి మన్మథన్





నేను పుణ్యతిథిలో పాల్గోవడానికి వెళ్ళాను. ఇలాంటి కర్మ కాండలకి చాలా దూరంగా ఉండే నేను ఒక వ్యక్తి వర్ధంతి సందర్భంగా జరిగిన మత క్రతు వులో పాల్గొనడానికి ఉత్తరా ఖండ్లోని హిమశిఖరాల మధ్య నున్న ఆశ్రమానికి అతిథిగా వెళ్ళాను. ఆ వ్యక్తినీ, ఆయన జీవితాన్నీ తరచి చూసిన కొద్దీ బతకడానికి అర్థం తెలుస్తూ ఉంది. అసలు బతుకంటే ఇదే కదా అనిపిస్తుంది. నిస్వార్థానికి నిదర్శనం కని పిస్తుంది. పేరుకి ఆధ్యాత్మికతే కానీ ఆయన చేసిన పోరాటా లన్నీ అసమా నతల్ని రూపు మాపడానికే. అసహాయులకి న్యాయం చేయడానికే. ఆయనే స్వామి మన్మథన్, భువనేశ్వరి మహిళా ఆశ్రమం వ్యవస్థాపకులు !

స్వామి మన్మథాన్, కేరళలో ఏ ప్రాంతమో తెలీదు. ఎందుకొ చ్చాడో, ఎప్పుడు, ఎక్కడ నుండి వచ్చాడో తెలీదు. ఆయన పుట్టుక, తల్లిదండ్రులు తదితర వివరాలేవీ తెలీవు. కానీ, ఉత్తరాఖండ్ రాష్ట్రంలోని అంజనీసైన్ అనే ప్రాంతపు ప్రజలకు దేవుడు. వాళ్ళ జీవితాల్లో వెలుగు నింపిన యోధుడు. ఆయన పుట్టుక, కుటుంబం, ఇతర వ్యక్తిగత వివరాల గురించిన సమాచా రం లేదు. కానీ, ఆయన తన ఆలోచన ద్వారా రగిల్చిన స్ఫూర్తి, ఆచరణ పరంగా మిగిల్చిన అసాధారణ కార్యక్రమాల రూపకల్పన ఈనాటికీ ఉన్నాయి !

ఆయనెంత అసాధారణ అన్వేషకుడంటే 15 సంవత్స రాల పాటు ఆ హిమగిరి ప్రాంతంలో దాదాపు ప్రతీ మారుమూల గ్రామాన్నీ జల్లెడ పట్టాడు. చైనా మనిషనీ, క్రైస్తవ సన్యాసనీ ఇంకా ఎన్నో నిందలు మోసాడు. మరెన్నో ఒడిదుడుకులు ఎదుర్కు న్నాడు. వాళ్ళ జీవితాల్లో విడదీయరాని భాగమ య్యాడు. అక్కడి మహిళల పరిస్థితిని కళ్ళారా చూసాడు. మద్యపానం మొదలు పురుషా ధిక్యత వరకూ అమలవుతున్న దారుణాల ఆక్రందనల్ని మనసు పెట్టి విన్నాడు. ఆయన చేసిన పోరాటాలు చూస్తే, అవన్నీ ప్రజాపక్షాన ఎలుగెత్తిన ఆకాంక్షల అభివ్యక్తులే. జనాం దోళనల వైపు వెల్లువలా సాగిన పురోగతికి చిహ్నాలే !

ఎక్కడెక్కడో తిరిగి ప్రజల స్థితి గతులు అధ్యయనం చేసి  సుమారు 55 ఏళ్ళక్రితం అక్కడి స్త్రీలు, పిల్లల కోసం పెట్టిన సంస్థే భువ నేశ్వరి మహిళా ఆశ్రమం. పార్వతీ దేవి దేహ భాగం పడిన ప్రాం తం కాన అక్కడ దేవాలయంలో భువనేశ్వరి యంత్రం ఉంద. నేది స్థల పురాణం, భక్తుల నమ్మకం. దాని ఆధారంతోనే మన్మథన్ చేపట్టిన గొప్ప సం స్కరణల మార్గం ఆ ఆశ్రమం. బాల బడులు మొదలు మూఢ నమ్మకాల నిర్మూలన వరకూ, గ్రామీణులకి గ్యాస్ స్టవ్, కుక్కర్ల పంపిణీ నుండి ప్రఖ్యాత చంద్రబదనీ ఆలయం మొదలు కొని సుమారు ఆరేడు ఆల యాల్లో జంతుబలుల నిర్మూ లన దాకా, ఘఢ్వాలీ విశ్వ విద్యాలయం కోసం ఉద్య మించడం నుంచీ మొట్ట మొదటి పర్యావరణ పాఠశాల స్థాపన వరకూ ఆయనో స్రవంతి, అలుపెరుగని పెను ప్రవాహం !

ఆ ప్రాంతంలోనే కాదు, ప్రజా భ్యుదయం కోసం, ప్రకృతి పరిరక్షణ కోసం పాటుపడు తున్న స్వామి మన్మథన్‌కి రోజురోజుకీ పెరుగుతున్న ప్రజాదరణ పై కన్నుకుట్టిన రాజ కీయ నేతలు, అసాంఘిక శక్తుల ప్రోద్భలంతో ఏప్రిల్ 6, 1990 న ఒక వ్యక్తి చేతుల్లో తుపాకీతో హత్య చేయ బడ్డాడు. చంపిన వ్యక్తి అరెస్టు కాబడి జైలుకి వెళ్ళి బెయిలు పై తిరిగొచ్చిన కొద్దికాలానికి స్థానికులు ఆ హంతకుడ్ని రాళ్ళతో తరిమి కొట్టి హత మార్చారనంటే స్వామి మన్మథన్‌కి ప్రజల హృదయం లో ఉన్న స్థానం అర్థమవు తుంది !

అలాంటి మహోన్నత వ్యక్తి వర్ధంతిని ఆయన సన్నిహితుల సమక్షంలోనే ప్రతీ ఏడూ చేస్తా మనీ ఇప్పటివరకూ ఆయన కుటుంబం తదితర వివరాలేవీ తెలీదంటూ దక్షిణా ది నుండి కనీసం ఈసారి ఆయన చనిపోయిన రోజున మీరు రాగలిగితే బావుంటుం దని ఆశ్రమ నిర్వాహకులు కోరడంతో కదిలి పోయాను. నిండు మనసుతో వెళ్ళి స్వామి మన్మథన్ పుణ్య తిథిలో పాల్గొ న్నాను. ఆధ్యాత్మికత పేరిట వాళ్ళు చేస్తున్న సామాజిక కార్యక్రమాలు చూసి ఆశ్చర్య పోయాను !

నన్ను ఆకర్షించిన రెండు విష యాలు, ఒకటి ఉదయం వెళ్ళే సరికి చెప్పులు, బ్యాగులు బ్లాక్ బోర్డులతో పాటు బయటపడేసి తరగతిగదిలో పిల్లలు చేస్తున్న వివిధ పాటల సంగీత సాధన. ఆ స్కూలుకి మన రిషీవ్యాలీ కూడా ఒకానొక స్ఫూర్తని తెలిసి సంతోషిం చాను.ఇక, రెండోది, వాళ్ళ అద్భుతమైన గ్రంథాలయం.ఒక యూనివ ర్సిటీ లైబ్రరీకి ఏమాత్రం తీసిపోని రీతిలో దాదాపు వంద పుస్తకాలు ప్రచురించిన ఆశ్ర మంలో ఉన్న గొప్ప గ్రంథాల యం. మొదట్లో మన్మథన్ ఆద్వర్యంలో చంద్రబద్నీ ఆల యంలో స్థాపించిన లైబ్రరీ తర్వాత ఆశ్రమంలోకి మార్చ దం జరిగిందట !

దక్షిణదికి చెందిన మహోన్నత వ్యక్తి. దశాబ్దా లుగా ఉత్తరాఖండ్‌లో అసాధారణ సమాజ సంక్షేమ కార్యక్రమాలకి తిరుగులేని చిరు నామాగా నిల్చినవాడు.అవిశ్రాంతంగా ప్రజల కోసం పనిచేస్తూనే జీవితాన్ని చాలించిన మహా వ్యక్తి. అటువంటి మనిషి కోసం అక్కడి ప్రజలు, సంస్థ ఉద్యో గులు కలిసి ప్రతీఏటా చేస్తూ వస్తున్న కార్యక్రమానికి మొట్ట మొదటి సారిగా దక్షిణాది రాష్ట్రాల నుండి ఆయన 35వ వర్ధంతి సభలో పాల్గొని, నివాళులు అర్పించడం నా మనః తృప్తి కోసమే కానీ మతక్రతువు ల మీద నమ్మకం తో మాత్రం కాదు. నాది మానవత తో కూడిన విశ్వ మానవవాదమే కానీ మత వాదం మాత్రం కాదు, కాబోదు !

(మన్మథన్ గురించి మరిన్ని పరిశోధనలు జరగాల్సి ఉంది. తమిళనాడుకి చెందిన అమ్మ ఆధ్యాత్మిక సంస్థ మన్మథన్ కోసం డాక్యు మెంటరీ చిత్రం కూడా రూపొంది స్తున్నట్లు తెలిసింది. ఆయన కోసం రాసిన ఒకట్రెండు హిందీ పుస్తకాలు కూడా ఉ న్నాయి. చదివే ఆసక్తి ఉంటే పంపుతాను. అద్భుతమైన అంతెత్తు పచ్చని శిఖరాల మధ్యలో హుందాగా నిల్చి, మనోహర మైన పర్యావరణ పాఠశాల ద్వారా ప్రకృతి స్పృహని ఎందరో విద్యార్థులకి కల్గిస్తూ, అనేకానేక సాంఘిక అంశాల పై ఈరోజు మరెంత గానో విస్తృత స్థాయిలో పని చేస్తున్న భువనేశ్వరి మహిళా ఆశ్రమం గురించి, స్ఫూర్తిదాత మన్మథన్ గురించి అక్కడ తీసిన కొన్ని ఫొటోలతో ఈ చిన్న రైటప్ !)







# తెలుగు భాషా సారస్వత సమున్నత శిఖరం

## మహామహులు తిరుమల రామచంద్ర !
## (ఒక అవిశ్రాంత గవేషకుడి సంక్షిప్త పరిచయం)







ఉల్లిపాయ తినడం పాపం, కాఫీ సేవనం నిషిద్ధం అనుకునే సాంప్రదాయ శ్రీవైష్ణవ కుటుంబంలో 1913 జూన్ 17న జన్మించారు. లింగాయతుల ప్రాభల్యం కలిగిన పాఠశాలల్లో చదివారు. అనేక భిన్న సంస్కృతుల మధ్య పెరిగారు. నిద్రలో నడిచే అలవాటు నుండి నత్తి సమస్య వరకూ ఎన్నో కష్టాల్ని స్వయంకృషితో అధిగమించారు. స్కాట్ గా తగలబడుతున్న హరిజనవాడల్లో మంటలార్పడానికి నీళ్ళు మోసారు. మహాత్మా గాంధీని బాల్యంలోనే దర్శించారు. కాస్త వయసొచ్చాక ఆయనతో కలిసి ప్రయాణించారు కూడా. పద్నాలుగేళ్ళకే తిరుపతి కాంగ్రెస్ టౌన్ కమిటీకి కార్యదర్శిగా పనిచేశారు. 1923 కాకినాడ కాంగ్రెస్ మహాసభలో పాల్గొన్నారు. స్వాతంత్ర్యోద్యమంలో పాల్గొని వెల్లూరు, తిరుచా నూరు జైళ్ళలో ఖైదీగా ఉంటూనే ఎన్నో గీతాలు, 'సత్యాగ్రహ విజయః' అనే నాటకం కూడా రాసారు. ఆత్మహత్య చేసుకుందామని ప్రయత్నించడం మొదలు ఆత్మాభిమానాన్ని జీవితాంతం కాపాడుకోవడం వరకూ ఎన్నెన్నో ఒడిదుడుకులను సులభంగా ఎదుర్కొన్న

ఆయనే మహామహోపాధ్యాయ శ్రీ తిరుమల రామచంద్ర !

ఆయన జీవితం సకల శాస్త్రాల సమాహారం. అపారమైన దివ్యానుభవాల సారం. తిరుగు లేని పాండిత్య నిలయం. అసంఖ్యాక విశిష్టతల భాండాగారం. నెల్లూరు, తిరుపతి, చెన్నై, తంజావూరు, కాన్పూరు, కరాచీ, బెలూచిస్తాన్, ఆఫ్ఘనిస్తాన్ లలో పనిచేశారు. హెటెల్లో పనివాడి నుండి పత్రికా సంపాదకుడి వరకూ, ఇనుప సామాను, పచారీ కొట్టు నుంచి పరిశోధకుడి వరకూ ఎన్నో అవతారాలు ఎత్తారు. భగత్‌సింగ్ అనుచరుల్ని మద్రాసు తరలిస్తున్నప్పుడు కావలి – బిట్రగుంట మధ్యన ఆ ఉద్యమకారుల్ని తప్పించేందుకు రైలుపై దాడికి పథకం వేసారనే మద్రాసు కుట్రకేసులో రామచంద్ర గారు అరెస్టు అయ్యారు. ఆయన తరపున ఆంధ్ర కేశరి ప్రకాశం గారు స్వయంగా వాదించడం వలనే నిర్దోషిగా విడుదలయ్యారు.

నిషేధిత సాయుధ విప్లవకారులతో కూడా సంబంధాలు పెట్టు కున్నారు. సమకాలీన ఆలోచనాపరులు అందరితోనూ సత్సంబంధాలు నెరిపారు. ఆయుర్వేదం నుండి పాకశాస్త్రం వరకూ అన్నింటా ప్రావీణ్యం సంపాదించారు !

తెలుగు సాహితీ జగత్తులో రామచంద్రగారిది మరువలేని ముద్ర. పాత్రికేయుడిగా, పరిష్కర్తగా,వ్యాసకర్తగా, రచయితగా, పరిశోధకుడిగా, నిత్యసంచారిగా, సైనికుడిగా, అన్వేషకుడిగా, వైజ్ఞానికుడిగా, ఆయుర్వేద పండితుడిగా ఆయన బహుముఖ ప్రజ్ఞాశాలి.ఇదంతా ఒకెత్తయితే భాషోద్ధారకునిగా ఆయన కృషి మరొకెత్తు. సంస్కృత, తమిళ, కన్నడ, మళ యాళ, ప్రాకృత, దేవనాగరి తదితర భాషల్లో ఎన్నదగిన ప్రజ్ఞ ఉ ండి కూడా బతికినంత కాలం ఏ రచనలోనైనా సరే, 'భాషా సేవకుడు' అని మాత్రమే తనని తాను పరిచయం చేసుకున్న తీరు ఆయనలోని నిరాడంబరతకీ, నిగర్వానికీ నిజమైన ప్రతీక. నిజానికి తెలుగు భాషను సుసంపన్నం చేసిన మహానుభావుల్లో రామచంద్రగారిది అరుదైన కృషి. 'మన లిపి పుట్టు పూర్వోత్తరాలు' నుండి 'నుడి నానుడి' వరకూ, 'గాథాసప్తతిలో తెలుగు పదాలు' నుండీ 'తెలుగు పత్రికల సాహిత్యసేవ', 'పలుకుబడి' దాకా ఆయన రచనలన్నీ తెలుగు నుడికారాన్ని పతాకస్థాయిలో ఎత్తి పట్టేవే. 'భారతి' నుండి 'గృహలక్ష్మి' వరకూ, నాడు ఆయన చెయ్యి పడని పత్రిక లేదంటే అతిశయోక్తి కాదు !

ఇవికాక తెలుగు ప్రముఖుల పరిచయం 'మరపురాని మనీషులు', 'సాహితీ సుగతుని స్వగతం', 'అహంభో అభివాదయే' వంటివి ఎన్నో. అన్నింటిలోకీ తెలుగు సాహిత్యంలో అత్యంత ముఖ్యమైన పాత్రను పోషించేది అద్భుతంగా, అనితరసాధ్యమైన అంకిత భావంతో అక్షర రూపంలో ఆయన మరణా నంతరం వెలువడిన సుమారు ఐదొందల పుటల ఆత్మకథ 'హంపీ నుంచి హరప్పా దాక'. కేంద్ర సాహిత్య అకాడమీ పురస్కారం పొందిన ఆయన స్వీయచరిత్ర చదవడం అపూర్వమైన విద్యుత్ తరంగాల ఝరిని శరీరంలో పొందడం. అమూల్యమైన అనుభూతుల సమ్మేళనాన్ని అంతరంగంలో అనుభవించడం. ఒక మహో న్నతుడయిన వ్యక్తి జీవితంలో మూడో వంతు భాగాన్ని ఆపేక్షతో అలుముకోవడం. మనల్ని మనం విస్తృతమూ,విశాలమూ చేసుకోవడం. ఒకరా ఇద్దరా ఎందరు మహనీయులు మనకి అందులో తారసపడతారని!, ఒకటా రెండా ఎన్ని మహత్కార్యాలు మన కళ్ళెదుట నిలిపారు ! ఎవరేమనుకున్నా సరే, తెలుగు జాతి సారస్వత స్థాయిని కచ్చితంగా శిఖరాగ్రానికి చేర్చిన అసాధారణ మేధావి తిరుమల రామచంద్ర !

ఆస్తిక నాస్తిక విచికిత్సకి అతీతంగా ఒకవైపు హేతువాదిగా, మరోవైపు ఆధ్యాత్మికవాదిగా

ఉండగలగడం ఆయనకే చెల్లింది. స్వతహాగా నాస్తికుడినని చెప్పుకున్న రామచంద్ర గారు, అమృత్‌సర్ స్వర్ణ దేవాలయం చూసి, "ఆ దేవాలయ నిర్వహణ అత్యద్భుతం. భారత దేశంలోని దేవాలయాలన్నీ ఆ విధంగా నిర్వహణలో ఉంటే భక్తిప్రపత్తులు విస్తరిస్తాయని నా విశ్వాసం" అంటారు. వీటన్నింటికన్నా లౌకికవాదిగా ఆయన్ని పసితనంలోనే నిలిపిన అసామాన్యమైన సంఘటన ఒకటి ప్రస్తావిం చాలి. అది తిరుపతిలోని గోవింద రామస్వామి మహాద్వార గోపురం మీద ఏకంగా కాంగ్రెస్ జెండా ఎగరేయడానికి ప్రయత్నించడం. అది సాధ్యంకాక నమ్మల్వార్ కోవెల గోపురం మీద విద్యార్థిగా కాంగ్రెస్ జెండా ఎగరేయడం. తిరుపతి వంటి ఆధ్యాత్మిక కేంద్రంలో దేశ సమైక్యతకు చిహ్నంగా దాదాపు శతాబ్దం క్రితం గుడిగోపురం పై లౌకిక సమానతా విలువలతో కూడిన పతాకాన్ని ఎగురవేయడం రామచంద్ర గారి ప్రజాతంత్ర స్వభావానికి నిదర్శనం !

తెలుగు సమాజమనే కాదు, ఇటు సాహిత్యం లోనూ, అటు సారస్వతంలోనూ కూడా దేశంలోనే తిరుమల రామచంద్ర గారి జీవితంతో సరిపోల్చగల వ్యక్తులు అరుదు. ఎంతటి మహా పండితుడో, అంతటి మహాపథికుడు.ఎంతటి అధ్యయన పిపాసో అంతే అభిజ్ఞాన జిజ్ఞాసి. దక్షిణాదిన మానవల్లి రామకృష్ణ కవీశ్వరులు మొదలుకొని ఉత్తరాన ఖాన్ అబ్దుల్ గఫార్ ఖాన్ వంటి పోరాట యోధుని వరకూ ఎంద రెందరు మహామహులతోనో సన్నిహితంగా మసిలిన మనీషి. తెలుగులో ప్రముఖులెం దరితోనో విలువైన ఇంటర్వ్యూలు చేసి వారం దరి అనుభవాల్ని అక్షరీకరించిన రామచంద్ర గారు ఆయన ఆత్మకథలో సుమారు వంద మందికి తక్కువ కాకుండా మేధావుల్ని, బుద్ధి శాలుల్ని, ప్రజాసేవకుల్ని పరిచయం చేసిన తీరు చదివితీరాలి . హంపీ విజయనగర సామ్రాజ్యం, ఆనెగొంది, హొస్పేట, తిరుపతి, నెల్లూరుతో ప్రారంభించి కరాచీ, కాన్పూరు, లక్నో, ఢిల్లీ, పంజాబ్, బెలూచిస్తాన్, ఆఫ్ఘనిస్తాన్ మానవ పురాతత్వ శోధనా కేంద్రం హరప్పా మొహం జోదారో తవ్వకాల దాకా అపారంగా పర్యటించి జీవితం సార్థకం చేసుకున్న ధన్యజీవి తిరుమల రామచంద్ర !

జీవితాంతం భాషా సారస్వత సేవకే వినియో గించిన రామచంద్రగారు తన 84వ ఏట అక్టోబరు12న మరణించారు. ఎన్నో ఎన్నదగిన మహత్కార్యాల్ని ఒక్కనిగానే చేసిన ఆయన జీవితాన్ని గురించి, చేసిన సారస్వత సేవ గురించీ తెలుగువారు పట్టించుకున్నది తక్కువ. అంతటి మహావ్యక్తి సమగ్ర రచనా సంపుటాలు ప్రచురించే కార్యక్రమం భవిష్యత్తులో జరగాలని ఆశిద్దాం. అన్నిటికంటే ప్రధానంగా, ఏకవ్యక్తి సైన్యంగా విలసిల్లిన తిరుమల రామచంద్ర గారి జీవితం, కృషికి సంబంధించి విశ్వ విద్యాలయ, కళాశాల స్థాయిలోనైనా విద్యార్థులకు తెలియ జేయవలసిన అవసరం ఉంది. తెలుగు భాషకు, భావజాలానికి,

భవిష్యత్ సారస్వత నిర్మాణానికి నిరంతర వారధిలా భాసిల్లిన ఆయన రచనా వ్యాసంగానికి వీలైనంత ప్రచారం కల్పించడం, ఆమేరకు ఆయన జీవితంలోని మరెన్నో పార్శ్వాల్ని పరిశోధించి వెలికితీయటం జరగాలి.ప్రాచ్యలిఖిత పరిశోధనలో ఆయన పేరిట పురస్కారం నెలకొల్పాలి. అన్నిటికంటే ముందు, ప్రభుత్వం, భాషాభిమాన సంస్థలు ఉమ్మడిగా పూనుకుని తిరుమల రామచంద్ర గారి పేర సారస్వత సంస్థ ఒకటి ఏర్పాటు చేసే దిశగా యోచించాలి. అదే నిఖార్సయిన ఆ మహా మేధావికి తెలుగు వారు ఇచ్చే నిజమైన నివాళి. అదే అవిశ్రాంత గవేషకుడికి తెనుగు సమాజం సగర్వంగా సమర్పించే సమున్నత గౌరవం. అదే ఒక అద్వితీయమైన పరిపూర్ణ మహామాన వుడిగా తిరుమల రామచంద్ర గారికి మనందరం మనస్ఫూర్తిగా చేయదగ్గ మానవీయ ప్రణామం !

**( జూన్ 17 మహామహోపాధ్యాయ తిరుమల రామచంద్ర గారి 111వ జయంతి.)**

# అసమానతా వ్యతిరేకోద్యమం : అర్జక్ సంఘ్ !

## రాజీపడని మానవవాది : రామ్ స్వరూప్ వర్మ !
## (ఒక ప్రత్యామ్నాయ ప్రజానేత పరిచయం !)



**నూ**టొక్క సంవత్సరాల క్రితం ఉత్తర భారతం లో జన్మించిన రామ్ స్వరూప్ వర్మ (1923 – 1998) సామాజిక ఆలోచనాపరుడు. క్రియాశీల సామ్య వాది. ప్రత్యామ్నాయ సాంస్కృతిక కార్యకర్త, రచయిత. ప్రధాన స్రవంతి రాజకీ యాల్లో కూడా అనేక పదవులు చేపట్టిన వ్యక్తి. ఏకంగా రామ్ మనోహర్ లోహియా తోనే విభేదించిన మహాసోషలిస్టు యోధుడు. సామాజిక మార్పుకి ఆర్థిక, రాజకీయ సంస్క రణలే చాలవనీ, సాంఘిక, సాంస్కృతిక చైతన్యం అవసరమని తలిచి 1968లో 'అర్జక్ సమాజ్' సంస్థని ఏర్పాటు చేసిన మానవీయ దార్శనికుడు. ఇందులోని సభ్యుల అంతా నాస్తిక హేతువాద మానవవాద సంప్ర దాయాన్ని పాటించేవారే !

మహాత్మా బుద్ధ, ఫూలే, పెరియార్, అంబేద్కర్ భావజాలంతో కొత్త పోకడల్ని నిర్మించిన అర్జక్ సంఘం, ఉత్తర భారత దేశంలో వైజ్ఞానిక మానవోద్యమానికి దారి చూపింది. అబ్రాహ్మ ణుల్ని మాత్రమే సభ్యులుగా చేసుకొని ఆధిపత్యానికి వ్యతిరేకంగా నిలిచింది. తులసీ రామాయణం మొదలుకొని మనుస్మృతి వరకూ మానవ త్వాన్ని మంట కలిపే గ్రంథాలన్నిటినీ బహిరంగంగానే తగలబెట్టింది. కులమతలింగ వర్ణ జాడ్యాలన్నింటికీ సమాధి కట్టాలని పిలుపు ఇచ్చింది. ఈ మొత్తం సంస్థాగత సైద్ధాంతిక భూమికని పరిపుష్టం చేసిన వ్యక్తి రామ్ స్వరూప్ వర్మ !

అట్టడుగు గ్రామీణ పరిస్థితుల్ని బాల్యం నుండే గమనిస్తూ వచ్చిన వర్మ విశ్వవిద్యా లయంలో చదువు అనంతరం ఐ. ఎ. ఎస్. గా అత్యున్నత అవకాశం వచ్చినప్పటికీ దానిని స్వచ్ఛందంగా వదులుకున్నా డంటారు. డా. బాబాసాహెబ్ అంబేద్కర్ భావజాలంతో ప్రభా వితమయిన వర్మ జీవితాంతం అణగారిన వర్గాల ప్రజల అభ్యున్నతికి కృషి చేశారు. సులభ శైలిలో ఎన్నో రచనలు చేశారు. లక్నోలో ఆయన స్థాపించిన అర్జక్ సంఘం ఈనాటికీ క్రియాశీలకంగా ఉంది. మూఢత్వం రొమ్ము విరుచుకు తిరిగే చోట కూడా, గ్రామీణ ప్రాంతాలలో అర్జక్ సంఘానికి కార్యకర్తలు, కార్యాలయాలు ఉన్నాయనంటే అప్పట్లో ఆయన నిబద్ధత ఏంటో తెలుస్తుంది !

శాసనసభ్యుడిగా ఎన్నికై చరణ్‌సింగ్ ప్రభు త్వంలో ఆర్థికశాఖ మంత్రిగా చేసిన వర్మ చరిత్రలో మొట్టమొదటి సారిగా అదనపు బడ్జట్ ప్రవేశ పెట్టాడంటారు. రాష్ట్రంలోని మొత్తం గ్రంథాలయాలు అన్నింటి లోనూ బాబాసాహెబ్ రచనల్ని ఉంచాలనే ఆదేశా లిచ్చారు. అంతే కాదు, మరో ప్రభుత్వం అంబేద్కర్ రచనలు రెంటిని నిషేధించి నపుడు ఉత్తరాది పెరియార్‌గా పేరొందిన ఆలోచనాపరుడు, సామాజిక కార్యకర్త లలాయ్ సింగ్ యాదవ్‌తో కలిసి అలహాబాద్ హైకోర్టు లో పిటీషన్ వేసి నిషేధం తొాల గించారు. పైగా ఏకంగా ప్రభుత్వం మీద పరువునష్టం దావా వేసి గెలుపొందారు !

(ఆసక్తి ఉన్నవారు అంతర్జాలంలో ఆయన గూర్చి ఉన్న సమాచారాన్ని కూడా చూడొచ్చు .దాదాపు అరడజను సార్లు శాసనసభకి ఎన్నికైన రామ్ స్వరూప్ వర్మ జీవితం మానవవాద ఉద్యమానికి అంకిత మైంది. బతికినంతకాలం బ్రాహ్మణీయ సంస్కృతికి వ్యతిరేకంగా పోరాడిన వర్మ అందులో సమూల మార్పు రావాల్సిందే కానీ సంస్కరణలు సాధ్యం కావనే వారు. ఒక రకంగా దళిత శ్రామిక బహుజనుల సొంతం అనే దృష్టితో “అర్జక్ సంఘ్’ స్థాపించారు. దీనికి శ్రామికులు, కష్టించేచారు అనే అర్థాలు న్నాయి. ఈరోజు మానవవాద దినోత్సవాన్ని పురస్కరించుకుని మానవవాద ఉద్యమశీలి రామ్ స్వరూప్ వర్మ గారి గురించిన ఈ చిరు రైటప్ !)

# “కమ్యూనిజం లక్ష్యం రామరాజ్య స్థాపన !!!”

**భారత కమ్యూనిస్టుపార్టీ స్థాపకుడు: సత్యభక్త !!**
**(ఆలోచనాశీలైన ఆధ్యాత్మిక సామ్యవాది కథ !)**








చెబితే వింతగా ఉంటుంది కానీ చరిత్ర పాతది. నచ్చినా లేకున్నా మార్చడానికి వీలులేనిది. ఒకరి ఇష్టాయిష్టాల్లో ఇమడనిది. నిర్దేశించిన చట్రాల్లో ఒరగనిది. లేకపోతే నేనేనాడో లేఖలు రాసి మరీ వెళ్ళొచ్చిన ఒకానొక ఆధ్యాత్మిక సంస్థకీ, భారతదేశంలో మొట్టమొదటి కమ్యూనిస్టు మహాసభ నిర్వహించి, పార్టీ స్థాపించిన వ్యక్తికీ సంబంధం ఉండటం. ఆయన అంతిమ దినాలు అక్కడే గడవటం. వందేళ్ళ క్రితం మొదలయిన మతతత్వ సంస్థ ప్రపంచ వ్యాప్తంగా శాఖోపశాఖలుగా విస్తరించగా, అదే వందేళ్ళలో కమ్యూనిస్టు పార్టీ లెక్కలేనన్ని పేర్లతో చీలిక పీలికలు కావడం. ఒకనాడు తీవ్ర పదజాలంతో విమర్శించిన, ఈరోజు నేను ఏమాత్రం అంగీకరించని భావజాలం కలిగిన ‘శాంతికుంజ్’ ఆశ్రమాన్ని గురించి మళ్ళీ ఇలా రాయవలసి రావడం !

భారతదేశంలో మొట్టమొదటి కమ్యూనిస్టు మహాసభ సరిగా వందేళ్ళ క్రితం కాన్పూర్‌లో జరిగింది. దీని స్థాపకుడు, నిర్వాహకుడు సత్యభక్త. ఏప్రిల్ 2, 1897లో పుట్టిన ఈయన అసలు పేరు చికన్‌లాల్. రాజస్థాన్ లోని భరత్‌పూర్ స్వస్థలం. ఆధ్యాత్మిక చింత నాశీలి. గాంధేయవాది. సత్యాన్వేషి. కమ్యూ నిస్టు పదానికి సమాన అర్థంగా ‘సామ్యవాద్’ అనే

హిందీ మాటని కోయిన్ చేసిన వాడు. 'సత్యయుగ్' అనే పత్రిక నడిపాడు. ఓమ్ ప్రథమంతో మార్క్సిజం గురించిన అనేక గ్రంథాలు రాసాడు. 'కమ్యూనిజం' ద్వారానే దేశంలో "రామ రాజ్యం" వస్తుందని చెప్పాడు. కమ్యూనిస్టు పార్టీ భారతీయత పట్ల తలెత్తిన వివాదాల కారణంగా బయటకెళ్ళి మరో కమ్యూనిస్టు పార్టీ పెట్టి ఏడాదిలోపే రద్దుచేసాడు. ఇదంతా ఒక వింత చరిత్ర !

యూపికి చెందిన హజ్రత్ మొహానీ, మద్రాసు నుండి సింగరవేలు చెట్టియార్, ముంబయి నుండి ఘాటే, బెంగాల్ నుండి ముజఫర్ అహ్మద్ వంటి మహామహులతో భారత దేశంలో మొదటి  మహాసభ తలపెట్టిన సత్యభక్త తదనంతరం ఆధ్యాత్మికత వైపుకు మళ్ళడం ఆసక్తికరమైన విషయం. ఇండియా లో జరిగిన ఈ వివాదాల పై ఎమ్మెన్ రాయ్ సత్యభక్తని ప్రభుత్వ ఏజంట్ అంటూ నిందిస్తే తిరిగి సత్యభక్త రాయ్‌ని బ్రిటిష్ ఏజంట్ అన్నాడం టారు. ఇక్కడి కమ్యూనిస్టు పార్టీ పై రష్యా పెత్తనాన్ని నిరసిస్తూ తన సంచి తీసుకుని మౌనంగా మహాసభ నుండి నిష్క్రమించిన సత్యభక్త ఆర్థిక, కుటుంబ, సామాజిక కారణాలతో చాలాకాలం పాటు మథుర లోని అఖండ జ్యోతి ఆధ్యాత్మిక కేంద్రంలో ఉండి, అక్కడే 1985 లో  చనిపోయాడు !

"కమ్యూనిజం మౌలిక లక్ష్యం రామరాజ్యాన్ని భూమ్మీద స్థాపించడం." అంటాడు సత్యభక్త. ఐతే, 'రామరాజ్యం' అతడి దృష్టిలోని సమతామమతా భావనలతో కూడిన సౌభ్రాతృత్వ సమాజమే కానీ మతతత్వ వ్యవస్థ కాదు. అందుకే, ఆధ్యాత్మిక సామ్యవాదాన్ని మార్క్సిస్ట్ వెలుగులో అధ్యయనం చేసిన సగటు పౌరుడిగా సత్యభక్త, తన పరి మితులకు, శక్తికి మించి కృషి చేశాడు. సైద్ధాంతిక రాజకీయ చైతన్యస్థాయి పట్ల సవాలక్ష భిన్నాభి ప్రాయాలు ఉండవచ్చు. కానీ, ఎవరు అవునన్నా కాదన్నా ఈ దేశంలో మొట్ట మొదటి కమ్యూనిస్టు పార్టీ స్థాపకుడిగా, మొట్టమొదటి కమ్యూనిస్టు మహాసభ నిర్వాహకునిగా సత్యభక్త స్థానాన్ని కాదనలేం. భావజాల విభేదాలే కానీ సమ సమాజ స్థాపనకు చేసిన కృషిలో సత్యభక్త నిజాయితీని  శంకించలేం !

ఢిల్లీ విశ్వవిద్యాలయ చరిత్ర అధ్యాపకులు చారుదత్తాగారితో సహా సత్యభక్త గురించి రాసిన శోధనా వ్యాసాలు అంతర్జాలంలో అందుబాటులో ఉన్నాయి. ఇక్కడ చెప్పాల్సిన విషయం ఒకటుంది. ఆగ్రాకి దగ్గరలో పుట్టిన శ్రీరామశర్మ ఆధ్యాత్మిక ఆలోచనాపరుడు. స్వాతంత్ర్యోద్యమంలో పాల్గొన్నాడు. ఈయన స్థాపించిన ఆధ్యాత్మిక సంస్థే ఈరోజు అత్యంత ప్రభావశీలమైన హైందవ శాఖలుగా విస్తరిం చింది. గాయత్రీ పరివార్ పేరుతో 'యుగ్ నిర్మాణ్ యోజన' అనే బృహత్తర ప్రణాళికతో దశాబ్దాలు గా కృషి చేసిన సంస్థ ఇది. హరిద్వార్‌లో ప్రసిద్ధి చెందిన 'శాంతికుంజ్' మహాశ్రమం ఈ సంస్థకు చెందినదే.

యూనివర్సిటీలు కూడా నడుపు తున్న ఈ సంస్థకి రామశర్మ దంపతులు దానం చేసిన కోట్లాది ఆస్తులు భరోసాగా ఉన్నట్లు చెబుతారు !

సందర్శించాలనుకునే వారికి హరిద్వార్‌లోని శాంతికుంజ్ అద్భుతమైన ఆశ్రమం. కీ. శే. ఆవంత్స సోమసుందర్ గారితో చర్చించి నప్పుడు కూడా ఈ ఆశ్రమం గురించి చెబు తుండేవారు.ఆగ్రా, మథరల నుండి 'అఖండ జ్యోతి' పేరుతో పత్రిక కూడా నడిపిన పండిత రామశర్మ గారు, 2000 కు పైబడి రచనలు చేసారంటారు. ప్రపంచ వ్యాప్తంగా అనేక భాషల్లో ఆ గ్రంథాలు అందుబాటులో ఉన్నాయి. ఒకప్పుడు నేను కూడా ఏవో కొన్ని చదవడానికి ప్రయత్నించాను కానీ, ఎందుకనో అప్పుడే ఎక్కలేదు. ఇప్పుడిక అసలు ఎక్కించుకునే ఓపికా, తీరికా రెండూ లేవు. పదిహేనేళ్ళ క్రితం అంగీకరిస్తే ఏకంగా నాకు 'దీక్ష' ఇవ్వడానికి ఆశ్రమ నిర్వాహకులు ముందుకొచ్చిన సంఘటనను నేనింకా మర్చిపోలేదు. ఆ పాజిటివ్ కార్నర్‌తోనే బహుశా ఉత్తరప్రత్యుత్తరాలు ఇరువైపులా నడిచాయి !

ఇప్పుడీ సంగతంతా దేనికంటే, కర్నాటకలో ఉద్యోగం చేస్తూ అక్కడ్నుంచీ సరాసరి శాంతి కుంజ్ వెళ్ళిపోయిన నేను, ఆ ఉత్తర ప్రత్యుత్త రాల తర్వాత ఆ మతతత్వాన్ని నిరసిం చాను. ఆనాడే ఉద్రేకంతో రచించిన "సాంఘిక తత్వం – వైప్లవ మార్గం" పుస్తకంలో ఆ ఆశ్రమాన్ని తీవ్రంగా దుయ్యబట్టాను. ఈరోజు దేశంలో మొదటి కమ్యూనిస్టు పార్టీ స్థాపకుడు చివరికి చేరిన చోటు మూలాలు తెల్సుకుని విస్తుపోతున్నాను. ఎందుకంటే, 1925 లోనే స్థాపించబడిన ఆర్.ఎస్.ఎస్. హెడ్గేవార్ కోసం నాగపూర్‌లో ప్రత్యేక శ్రద్ధ వహించి ఆయన స్మృతి చిహ్నాన్ని కూడా నిర్మించింది. కాగా, ఈ దేశంలో అదే 1925 లో స్థాపించబడిన మొదటి కమ్యూనిస్టు పార్టీ విషయంలో కమ్యూనిస్టులలోనే ఏకాభి ప్రాయం లేదు. కాగా, సత్యభక్త పేరే ఎవరికీ తెలియకపోవడం కడు శోచనీయం !

(విచిత్రంగా తెలుగు ప్రాంతంలో కూడా అనేక పాయలుగా ఉన్న ఈ 'గాయత్రీ పరివార్'కి వాళ్ళ 'విచార్ క్రాంతి అభియాన్' కీ భారత దేశంలోని కమ్యూనిస్టు పార్టీ వ్యవస్థాపకుడి తో సంబంధం ఉండటం. అంతకంటే ఆశ్చర్యం సామ్యవాద ఆధ్యాత్మికతను అనుసరించిన సత్యభక్త తన చివరిరోజులు ఆశ్రమంలోనే ముగించడం. మార్క్సిజాన్ని ఇస్లాం, క్రిస్టియాన్టీ, హిందూ, బౌద్ధ జైన సిక్కు మతాలకి అన్వయించిన ఎన్నో దాఖలాలు మనకి కనిపిస్తాయి. కాగా ఈ దేశపు సాంస్కృతిక వారసత్వాన్ని వైజ్ఞానిక సామ్య వాదంతో ముడిపెట్టిన సత్యభక్తను నిబద్ధత కలిగిన సత్యాన్వేషిగా గుర్తించకుండా అనామకంగా వదిలేయడం బాధాకరమని భావిస్తూ చాన్నాళ్ళ నుండి రాయాలను కుంటున్న ఈ చిన్న రైటప్ !)

# జాతి వివక్షత అంతమే ఆయన పంతం !

**స్వామి జాన్ ధర్మతీర్థ @ పరమేశ్వర మీనన్ !!**
**(ఒక కులనిర్మూలన యోధుడి పరిచయం !!!)**







స్వామి జాన్ ధర్మతీర్థ. ఎలాంటి పేరది. ఎలాంటి మనిషాయన.ఎన్ని సంఘర్షణల్ని చవి చూసారు, మరెన్ని సంగ్రామాలు చేసారు. బతికినంతకాలం అన్వేషిస్తూనే ఉన్నారు. మరణా నంతరం కూడా గుర్తుండిపోయే మహత్తర జీవితం గడిపారు. అసమానతల్ని మనస్పూర్తిగా అసహ్యించుకునే ప్రతి ఒక్కరికీ అద్భుతమైన అక్షరాయుధాల్ని అందించారు. ఏకంగా బాబాసాహెబ్ అంబేద్కర్ కూడా చదివి మెచ్చుకునే స్థాయి కలిగిన మహా చైతన్యాన్ని సంధించారు. తెలుగులో సామా జిక ఆలోచనా పరులంతా గుర్తుంచుకు తీరాల్సిన వ్యక్తి స్వామి జాన్ ధర్మతీర్థ !

పరమేశ్వరమీనన్‌గా 1893లో కేరళలోనిత్రిశూర్ జిల్లాలోని గురువాయుర్ దగ్గర జన్మించిన ధర్మతీర్థ పై థియోసాఫికల్ సొసైటీ మొదలుకొని స్వామి వివేకానంద, రామకృష్ణ పరమహంస, అనిబీసెంట్ మొదలైన వారి ప్రభావం ఉంది. మద్రాసులో చదూతూనే ఎన్నో స్వాతంత్ర్య పోరాటాలతో సంబంధాలు పెట్టు కున్న ధర్మతీర్థ కొంతకాలం బొంబాయి లో లాయర్‌గా కూడా పనిచేశారు. వ్యక్తిగత జీవితంలో వివాహం, విడాకులు కూడా అప్పుడే అయిపోయాయ్. త్రిశూర్‌లో ప్రజా నేతగా, మంచి ఉపన్యాసకుడిగా కూడా పేరుగాంచాడు.'స్నేహితన్' వంటి పత్రికలూ నడిపాడు !

సాంఘిక విప్లవకారుడు నారాయణగురు ప్రభావంతో తరువాత కాలంలో చేస్తున్న వృత్తి వదిలిపెట్టి స్వామి ధర్మతీర్థగా మారి సన్యా సం స్వీకరించారు. తన పర్యటనలో భాగంగా నారాయణ గురు ఒక రాత్రి మీనన్ ఇంట్లో బసచేయడం, ఆ సందర్భంగా జరిగిన చర్చ ధర్మతీర్థలో పెను మార్పు కి కారణ మంటారు ఆయన జీవితం గురించి

శోధించినశ్రీకుమార్. మీనన్‌ని శివగిరికి ఆహ్వానించిన నారాయణ గురు ఆయనకి స్వామి ధర్మతీర్థ అనే పేరుతో పాటు ఆశ్రమ నిర్వాహక బాధ్యతను కూడా అప్పగించారు. అప్పుడే ధర్మతీర్థ నారాయణ గురు గురించి అద్భుతమైన రచన కూడా చేసారు !

ఇంకా తర్వాత కాలంలో విస్తృతంగా అధ్య యన పర్యటనలు చేస్తూనే, విభేదాల కారణంగా ఆశ్రమం నుండి తప్పుకున్న ధర్మతీర్థ దేశంలోని ప్రాంతాలన్నిటినీ అధ్యయనం చేసి అనితర సాధ్యమైన రీతిలో చేసిన చేసిన పరిశోధనే,కలేకూరి అనువదించిన "హిందూ సామ్రాజ్యవాద చరిత్ర"(హెచ్.బి.టి.ప్రచురణ) ఇక్కడో ఆసక్తికరమైన విషయం చెప్పుకోవాలి. తిరుగులేని సాంస్కృతిక వికాసోద్యమ శోధ కుడిగా అనేక ప్రాంతాలు తిరిగిన ధర్మతీర్థ రాజమహేంద్రవరంలోని యడ్ల రామదాసు మఠంలో కొద్దికాలం ఉన్నారు. అది కేవలం వసతి కోసం చేసిన పని కాదు. ఒక అద్భుత మైన కులనిర్మూలన కోసం చేసిన అక్షరా విష్కరణ ప్రయత్నం !

After months of wandering he found shelter at Edla Ramdas mutt at Rajah mundry in the state of Andhra. He utilised this opportunity for serious study and deep contemplation about the vices and crulties he had experi enced and witnessed in the name of Hindu religion. And its wretched caste system. This eventually led him to jot down his masterpiece work, The menace of Hindu imperialism...' అంటారు ధర్మతీర్థ జీవితం గురించి రాసిన పరిశోధక వ్యాసంలో పి. ఆర్. శ్రీకుమార్. లోకకళ్యాణం కోసం దేశాటన చేస్తూ వచ్చిన ఒక మహా మనిషి సాంస్కృతిక రాజధానైన రాజమండ్రి కేంద్రంగా చేసుకుని "హిందూ సామ్రాజ్యవాద చరిత్ర" అంతుతేల్చడం. కులాన్ని చీల్చి చెండాడడం. అందుకు ఈ ప్రాంతం కూడా ఆయనకు తోడ్పడటం!

హిందూమతంలోని చెడుగుల్ని గురించి కుల వ్యవస్థను గురించి అంత లోతుగా శోధించిన ఒక గొప్ప సామాజిక ఆలోచనాపరుడిని ఆదరిం చిన యడ్ల రామదాసు మహాకవి, సంస్కరణ వాది. నిట్టల ప్రకాశదాసు, యడ్ల రామదాసుల్ని గూర్చి చెళ్ళపిళ్ళవారువ్యాసం కూడా రాసారు.అసమానతలకి వ్యతిరేకంగా ఎన్నో తత్వాలు రాసినాయన కోసం తెలుగు వారు పట్టించుకున్న దాఖలాలు లేవు. రాజ మండ్రిలో సాధుస్త్రీలమఠంలో ఉండే మహిళా సన్యాసినులు కూడా బహిస్టు సమయంలో యడ్ల రామదాసు గారి మఠానికే వచ్చి ఉండే వారట. అలాంటి మఠం స్థానంలో ఈరోజు పిచ్చి మొక్కలు తప్పా ఏమీ లేవు. పక్కనున్న రామదాసు గుడి కూడా పాడు బడుతోంది !

కులనిర్మూలనకై శ్రమించిన స్వామి ధర్మతీర్థని ఓ సందర్భంలో అంబే ద్కర్, హిందుత్వంలోని వివక్షకి వ్యతిరేకంగా ఏ మతాన్ని అనుసరి స్తారని అడగ్గా, క్రైస్తవ మతం అని ధర్మతీర్థ చెప్పారు. ఒక హైందవ సన్యాసి నోట నుండి వచ్చిన ఆ జవాబు విని బాబా సాహెబ్ ఆశ్చర్య పోయారు. ఢిల్లీ,లాహోర్ వంటి చోట్ల గడిపిన ధర్మతీర్థ స్వాతంత్ర్యం వచ్చిన రెండు సంవత్సరాలకి నారాయణ గురు భావప్రచార సంస్థకి రాజీ నామా చేసి బాప్తి స్మం తీసుకుని స్వామి జాన్ ధర్మతీర్థగా మారాడు. అన్వేషణ మార్గాన్ని మాత్రం వదలలేదు !

హైందవం, క్రైస్తవాల పై ఎన్నో గొప్ప రచనలు చేశాడు. కొన్నేళ్ళ పాటు తమిళనాడులోని క్రైస్తవ ఆశ్రమంలో ఉన్నారు. మళయాళంలో ఆత్మకథ రాసిన ధర్మతీర్థ జూలై 19, 1976 న తిరువనంతపురంలో మరణించారు. ఆయన సమాధి త్రివేంద్రంలోని సి. ఎస్. ఐ. చర్చి ప్రాంగణంలో ఉంది. ఆయన స్మృతిలో రెండు చర్చిలు కూడా నిర్మించారు. ఒక హిందూ సన్యాసి పేరు మీద చర్చిలు నిర్మించబడటం అరుదైన విషయం.అలాంటి అసాధారణమైన స్వామి జాన్ ధర్మతీర్థర్ గురించి, ఈ తెలుగు ప్రాంతంతో ఆయనకున్న అనుబంధం గురించి ఆ మధ్య రామదాసు మఠానికి వెళ్ళొచ్చిన ఫొటోలతో ఈ చిన్న రైటప్ !



# రెండు మహోద్యమాల సమైకత.






**భా**రతదేశ సాంఘిక పురోగతిని త్వరితం చేసిన రెండు మహోద్యమాలకి నూరేళ్ళు పూర్తవు తున్న సందర్భంగా ఆ రెంటినీ స్మరించుకోవడం మన కర్తవ్యం. ఒకటి కుల నిర్మూలన పోరా టాలకి దేశం లోనే అత్యంత ముఖ్యమైన భూమికగా భావించే వైకోమ్ సత్యాగ్రహం. రెండు దేశంలోనే మొట్టమొదటి సోషలిస్టు సంస్థల్లో ఒకటైన 'హిందుస్థాన్ సోషలిస్ట్ రిపబ్లికన్ అసోసియేషన్' వందేళ్ళ క్రితం స్థాపించబడిన సందర్భం. అసమానతలకు వ్యతిరేకంగా జరిగిన ఈ రెండు చారిత్రక ప్రాధాన్యత కలిగిన మహత్తర ఉద్యమాలు ప్రత్యామ్నాయ ప్రజాతంత్ర భావోద్యమ చరిత్రలో అత్యంత విశిష్టమైనవి.

1924 మార్చిలో దక్షిణాదిన ట్రావెన్కోర్ ప్రాంతం కేరళలో కుల వివక్షతని నిరసిస్తూ దేవుడి ముందు మనుషులంతా సమానమే అనే సందేశంతో జరిగిన గొప్ప ఉద్యమం వైకోమ్. కేలప్పన్, కేశవ మీనన్, మాధవన్ మొదలైన నాయకుల నిబద్ధతతో ప్రపంచ చరిత్రలోనే600 రోజులకు పైబడి సుదీర్ఘంగా జరిగిన అపురూపమైన సత్యాగ్రహం అది. తర్వాత కాలంలో దేశంలోని వివక్షతా వ్యతిరేక ఉద్యమాలెన్నింటికో మార్గం చూపింది. అంతేకాదు, ఎంతోమంది మహత్తర నాయకుల్ని దేశానికి అందించింది. పెరియార్ రామస్వామిని 'వైకోమ్ వీరుడి' గా మల్చింది. బషీర్ వంటి విలక్షణమైన రచయితను లోకానికి అందిం చింది. అన్నిటికంటే ముఖ్యంగా, అహింసా యుత ప్రజాస్వామ్య సత్యాగ్రహం స్ఫూర్తిని నలుదిశలా చాటింది.

అలాగే, సరిగ్గా 1924 లోనే ఉత్తరాదిన ఆవిర్భ వించిన అద్భుతమైన సోషలిస్టు సంఘం, 'హిందుస్తాన్ సోషలిస్ట్ రిపబ్లికన్ అసోసి యేషన్'. దీనినే హిందుస్తాన్ సోషలిస్టు రిపబ్లిక్ ఆర్మీ అని కూడా పిలిచేవారు. మొదటి ఆధునిక భారతీయ శాస్త్రీయ సామ్యవాద లౌకిక సంస్థ. భగత్‌సింగ్ మొదలు చంద్రశేఖర్ ఆజాద్ వరకూ వందలాది మంది యువజనుల జీవితాల పై అపారమైన ప్రభావం చూపింది.

The Revolutionary పేరిట ప్రకటించిన మేనిఫెస్టోలో మొట్టమొదటిసారిగా

దేశ చరిత్రలో 'ఫెడరల్ రిపబ్లిక్ ఆఫ్ యునైటెడ్ స్టేట్స్ ఆఫ్ ఇండియా' అంటూ రాజ్యాంగ బద్ధమైన నిర్మాణానికి సంబంధించిన ముసాయిదాను స్పష్టంగా ప్రకటించింది. తర్వాత కాలంలో దేశంలోని ఎన్నో లౌకిక ప్రజాతంత్ర వామపక్ష, సోషలిస్టు పార్టీలకి, ఉద్యమాలకి మార్గ దర్శకమైంది.

కులనిర్మూలనకి సంబంధించీ వైకోమ్ సత్యా గ్రహం ఎంతటి ప్రభావాన్ని చూపిందంటే, ఆ స్ఫూర్తితోనే నారాయణగురు చాటిచెప్పిన 'మనుషులందరికీ ఒకే కులం, ఒకే మతం, ఒకే దేవుడు' అనే భావజాలం ఆ ప్రాంతంలో బలంగా నెలకొంది. అలాగే, మత సామరస్యతకి, పౌర చైతన్యానికి కూడా వైకోమ్ తిరుగులేని ప్రతీక. అంతటి వైకోమ్ సత్యాగ్రహం కోసం ఉద్దేశించిన తీర్మానం 1923 లో జరిగిన కాకినాడ కాంగ్రెస్ మహాసభల్లోనే ప్రవేశపెట్టారనే విషయం మర్చిపోకూడదు. ఆ రకంగా ఒక గొప్ప ప్రజాతంత్ర ఉద్యమానికి సంబంధించిన నాందీ ప్రస్థావనకి తెలుగు నేలమీదే అంకురార్పణ జరిగింది. అలా కాకినాడలో జరిగిన కాంగ్రెస్ మహాసభలు మహత్తరమైన చారిత్రక మార్పుకు దోహదం చేసాయ్.

ఇక మత సమైక్యతా నినాదం తో H.S.R.A.కి అనుబంధ సంస్థగా 'నౌజవాన్ భారత్ సభ'ను అనితర సాధ్యంగా నిర్మించడం చిన్న విషయం కాదు. రాంప్రసాద్ బిస్మిల్, అష్ఫఖుల్లాఖాన్‌ల అకళంకిత మైత్రి ఈ దేశంలో ఎన్నటికీ నిల్చి పోయే హిందూ,ముస్లిం ఐక్యతకి తిరుగులేని చిహ్నం. H.R.A గా ఉన్న సంస్థ పేరును, సామ్యవాద లక్ష్యం ప్రతిబింబించేలా 'సోషలిస్టు' పదం చేర్చి H.S.R.A. గా మార్పు చేయడం, భగత్‌సింగ్ అసాధారణ పరిణితికి ప్రతీక. తర్వాత కాలంలో స్వాతంత్ర్య భారతదేశంలో దశాబ్దాల అనంతరం చేయబడ్డ రాజ్యాంగ సవరణను ఎన్నడో ఊహించి, ఈ దేశానికి అవసరమైన సోషలిస్టు విధానాన్ని చాలా కాలం ముందే కచ్చితంగా నిర్ధారించి చెప్పిన దార్శనికుడు భగత్‌సింగ్.

కులమత భేదాలకు అతీతంగా మంచి మానవ సమాజమే లక్ష్యంగా సాగిన రెండు సమాంతర మహోద్యమాలూ పౌర సమాజ చైతన్యానికి ప్రతీకలే. ఒకటి అహింసా విధానంలో భాగంగా జరిగితే, మరొకటి సాయుధ మార్గంలో సక్రియా త్మక పద్ధతిలో జరిగింది. ఈ రెండింటిని ముందుండి నడిపించిన ఇరువురు ప్రధాన వ్యక్తుల్ని గురించి ప్రస్తావించకుండా ఈ అంకం పూర్తి కాదు. ఒకరు గాంధీ, మరొకరు భగత్ సింగ్. రెంటినీ ప్రజా ఉద్యమాలుగా మల్చడం లో ఇరువురు పాటించిన విధానాల్లో ఎన్న యినా భిన్నాభిప్రాయాలు ఉండనివ్వండి. కానీ, ప్రజల ధిక్కారాన్ని నిర్మాణాత్మకం కావించి, దానిని మహోద్యమంగా మలిచిన ఘనత మాత్రం ఇద్దరికీ దక్కుతుంది.

ఆ స్ఫూర్తి అక్కడితో ఆగలేదు. తదనంతరం వామపక్ష భావజాల స్రవంతిలో భాగంగా

1925 లో కాన్పూర్ కేంద్రంగా మొదటి భారతీయ కమ్యూనిస్టుపార్టీ స్థాపించబడింది. అలాగే అమానవీయ కుల వివక్షతకి వ్యతిరేకంగా 1927లో డా. బి. ఆర్. అంబేద్కర్ నేతృత్వంలో చారిత్రక మహద్ సత్యాగ్రహం మహెూద్యమంగా రూపొందింది. నాటి నుండి నేటి వరకు ఎన్ని పాయలుగా చీలినప్పటికీ, సామాజిక న్యాయమనే సూత్రబద్దమయిన దృక్పథంతో ఈ దేశంలో అనేక రకాలుగా సాగుతున్న ప్రజాతంత్ర లౌకికవాద భావోద్యమాలకి స్ఫూర్తిని అందించిన మౌలికమైన మానవీయ కోణాలుగ వైకోమ్ సత్యాగ్రహం, హిందుస్తాన్ సోషలిస్టు రిపబ్లికన్ అసోసియేషన్ ఉద్యమాలను అభివర్ణించు కోవచ్చు.

ఆధునిక భారతదేశంలో ఆధ్యాత్మికత పేరిట చెలామణీ అవుతున్న బ్రాహ్మణాధిక్యతని మొదటిసారి బహిరంగంగా సవాలు చేసింది వైకోమ్ సత్యాగ్రహం. బహుజన కులాల ఉమ్మడి ఆకాంక్షను ప్రజాస్వామిక విలువలకు కట్టుబడి సుస్థిరమైన పద్ధతిలో వైకోమ్ పోరాటం వ్యక్తపర్చిన తీరు అద్భుతం. అలాగే, కేవలం పరాయి బ్రిటీష్ పాలన పట్ల వ్యతిరేకతకే పరిమితం కాకుండా దోపిడీ, పీడన లేని సమసమాజ స్థాపనకోసం సంపూర్ణ స్వాతంత్ర్యం నినాదాన్ని ప్రప్రథమంగా వినిపించింది హిందుస్తాన్ సోషలిస్టు రిపబ్లికన్ అసోసియేషన్. విదేశీ దోపిడీదారుల స్థానంలో స్వదేశీ దోపిడీ దారులు వచ్చినంతలో దేశంలోని అణగారిన వర్గాల ప్రజల జీవితాలకి ఏమీ ఒరగ దనే సత్యాన్ని, ఎల్లకాలం పీడితుల పై బల ప్రయోగం సాగదంటూ ప్రపంచ చరిత్రలో మొదటిసారిగా దేశ చట్టసభలో ప్రాణాపాయం లేని పొగ బాంబులు వేసి మరీ ప్రకటించగలిగిన ఏకైక సంస్థ హెచ్. ఎస్. ఆర్. ఏ. ఇది జరిగిన సరిగ్గా నాలుగేళ్ళకు బ్రిటిష్ పాలనకు వ్యతి రేకంగా ఆంధ్రదేశంలో మొట్టమొదటి బాంబు పేలింది కూడా కాకినాడలోనే కావడం గమనార్హం.

కులతత్వం, మతతత్వం, పురుషాధిక్యత, ప్రాంతీయ స్వామ్యం, రాజకీయ దురహంకారం,వ్యక్తిఆరాధన, సంకుచిత స్వార్ధపరత్వం  రాజ్యమేలుతున్న ప్రస్తుత పరిస్తితులలో సమానతా సాధనే ప్రధానంగా సమిష్టి కృషితో సాగిన ఆ మహెూద్యమాలు రెంటినీ లోతుగా అధ్యయనం చేయడం ప్రతీ ప్రత్యామ్నాయ ప్రజాతంత్ర స్రవంతికీ తప్పనిసరి. రాబోయే కాలంలో నూతన యువజనోద్యమాల  నిర్మాణానికి, సామాజిక శక్తుల చేతనకి ఈ రెండు ఉద్యమ నేపథ్యాల్ని సమన్వయం చేసి బలమైన వ్యూహంతో ముందుకు వెళ్ళడమే ప్రజాస్వామ్య ఉద్యమ శ్రేణుల బాధ్యత.

అందులో భాగంగా భగత్‌సింగ్, రాజ్‌గురు, సుఖ్‌దేవ్‌ల అమరత్వానికి సార్ధకత చేకూరేలా అసమానతా వ్యతిరేక ఉద్యమాల్ని కొత్తగా, శక్తివంతంగా నిర్మించుకోవాలి. రాజ్యాంగ బద్ధమైన మార్పుకోసం ఉద్దేశించిన విధానాలను నిర్వీర్యం కాకుండా కాపాడు కోవాలి.

అంతిమంగా సాంస్కృతిక చైతన్యానికి చేయూతనిచ్చే సాధనాలుగా చారిత్రక ఉద్యమాల సారాన్ని పౌర సమాజంలో నూ,ముఖ్యంగా యువతలోనూ రగిలించ గలిగినప్పుడే వ్యవస్థ పురోగతి సాధ్యమని, అదే ఏ ఉద్యమానికైనా కీలకమని గుర్తించగలగాలి. అప్పుడే ముందుతరాల వారు చేసిన అసంఖ్యాక త్యాగాలకి మనవంతు విలువ ఇచ్చిన వాళ్ళమౌతాం. భారతీయ సామాజిక చరిత్రలో మైలురాళ్ళుగా నిల్చిపోయే మహత్తరమైన మానవీయ ఉద్యమాలకు అర్ధవంతమైన వారసత్వాన్ని అందించిన వాళ్ళమౌతాం.

**(వైకోమ్ సత్యాగ్రహానికి, హిందుస్తాన్ సోషలిస్ట్ రిపబ్లికన్ అసోసియేషన్ కి వందేళ్ళు.)**

# మహావైజ్ఞానికుడు సి. వి. రామన్ స్మృతిలో...

**తెర్చుకున్న తలుపులు - మల్చుకున్న మలుపులు**
**(ఒక ఔద్వేగిక కళాతాత్విక మానవీయ స్రవంతి)**




చంద్రశేఖర వెంకట రామన్. పరిచయం అవసరం లేని పేరు. మానవ పురోగతికి ప్రయోగాత్మక పరిశోధనే పరమావధనే అన్వేషణకు మారుపేరు. తమిళనాడులో పుట్టిన రామన్ బెంగుళూరులో మరణిం చారు.ఐతే, కోల్‌కతాతో ఆయనకి గాఢమైన మైత్రీభావన ఉంది. ఐదు దశాబ్దాల క్రితమే భౌతికంగా అస్తమించిన ఆయన 30 ఏళ్ళ జీవన సౌధాన్ని కళతో పునర్జీవింప జేసిన విశిష్టమైన విశేషమిది !

అనుకోకుండా బయలుదేరాల్సి రావడంతో ఆరేసీలో టికెట్ తీసుకుని ఉదయమే బెంగుళూరులో దిగాను. రైల్లో ఉండగానే మంచి వార్తొకటి కనిపించింది. సి. వి. రామన్ రీసెర్చ్ ఇంస్టిట్యూట్‌కి 75 సంవత్సరాలు పూర్తయిన అమృతోత్సవ స్మృతి చిహ్నంగా ప్రభుత్వం ప్రత్యేకంగా పోస్టల్ స్టాంపును విడుదల చేసింది. దానిని రూపొం దించే బాధ్యత కోల్‌కతాకు చెందిన కళాకారుడు అవిజిత్ దత్తాకి ఇచ్చింది !

సమకాలీన కళాకారుల్లో ప్రత్యేక శైలి కలిగిన

ఆయన సి.వి. రామన్ జీవితానికి హృదయం తో రంగులద్దాడు. అవి అనేక విభిన్నమైన రూపాలు ధరించాయ్. అభివ్యక్తిని మించిన అనుభూతి కళకి మరేదీ లేదని చెప్పే ఆయన సృష్టించిన వివిధ రీతుల్లోని పదిహేను వర్ణ చిత్రాలతో నగరం నడిబొడ్డున మళ్ళాపురం లో సి.వి. రామన్ 30 ఏళ్ళపాటు జీవించిన రెండున్నర ఎకరాల ఇల్లు “పంచవటి” లో రెండురోజుల ప్రదర్శన ఏర్పాటు చేశారు !

అసలే అంతంతమాత్రపు టెక్నికల్ భాషా సమస్య తో ఉన్న నాకు నిజంగా రేపిడో చేసినమేలు చిన్నది కాదు. మామూలుగా చూడ్డానికి నోచుకోని సి. వి. రామన్ ఇల్లూ, అందులోని అద్భుతమైన పెయింటింగ్స్. కోల్‌కతా గురించి అవిజిత్ దత్తా అనుబం ధాన్ని





స్పర్శిస్తూ మానుష్ జాన్, రామన్ మనవడు, కన్యకి ఆర్ట్ గ్యాలరీ సహ వ్యవస్థాపకుడు వివేక్ రాధాకృష్ణన్ సంయుక్తంగా నిర్మించిన 7 నిమిషాల చిన్న సినిమా My City, My Mother' స్క్రీనింగ్ కూడా చూసేసాను !

భారతీయ పరిశోధనా పరిధిని విస్తృతంచేసిన శాస్త్రవేత్తగా రామన్‌కు కోల్‌కతాతో ఉన్న అనుబంధంతో వ్యక్తిగతంగా ఆ నగరంతోని సంబంధాన్ని మిళితం చేసిన గాఢతకి కొలమానమైన ఈ పెయింటింగ్స్ ప్రదర్శన వచ్చే నెల 19 వరకూ కన్యకి ఆర్ట్ గ్యాలరీలో ఉంటుం దట. కళాభివ్యక్తిలో ప్రత్యేక శైలిని కలిగిన అవిజిత్ ఈ ప్రదర్శనను రెండు నగరాలకు ఇచ్చిన అంకితం The artwork pay homage to Two cities : Kolkata and Bengaluru.గా పేర్కోవడం హృద్యమైన వాక్యం !

(ఆఖర్న కుదిరింది కాబట్టి ఆసక్తి ఉన్నవారి కోసం వెళ్ళొచ్చిన ఫొటోలు పెడుతున్నాను. అయినంతలో చూసొచ్చి రాస్తున్నానే కాని కళల్ని జడ్జ్ చేసే టంత సబ్జెక్ట్ నాకేమీ లేదు. కొద్దో గొప్పో కళల పట్ల, సైన్సు, పెయింటింగ్స్ పట్లా  అభిరుచి, గౌరవం కలవారైతే ఇంకా ఎక్కువగా ఆనందించడానికి, విశ్లేషించడానికి అవకాశం ఉంటుం దనే అభిప్రాయంతో ఇప్పటికిలా ఈ చిన్న రైటప్ !)

# అమరుడి ఆశయసాధనకు వందేళ్ళు !

**అరుదైన భారతీయ ధిక్కార వారసత్వం**
**అల్లూరి సీతారామరాజు**
**(తిరుగులేని తెలుగుజాతి వెలుగుబాట)**

"శ్రీ రామరాజు అనుసరించిన పద్ధతులతో నేను ఏకీభవించ లేను. ఐనా, ఆయన అకుంఠిత సాహసమూ, త్యాగదీక్ష, ఏకా గ్రత, ఉత్తమ శీలమూ, నిరాడం బరమైన జీవన విధానం మనందరమూ అలవర్చు కోవలసినవి."

**– మహాత్మాగాంధీ**

"శ్రీ రామరాజు వేళ్ళ పై లెక్కించగల స్వల్ప సంఖ్యగల అనుచరుల సహాయంతో బ్రిటీష్ ప్రభుత్వాన్నే గడగడ లాడించిన ధైర్యసాహ సోపేత వీరుడని స్పష్టమైనది. అటువంటి ధైర్యసాహసాలు గల వీరులు అరుదు."

**– జవహర్లాల్ నెహ్రూ**

"శ్రీ రామరాజు ధైర్యసాహసాలు,దేశభక్తి, పట్టు దల, పౌరుషము, అతని ఖ్యాతిని నలుదిశలా వ్యాపింపజేసినవి. అతని విధానాలు అంగీక రించని వారు కూడా ఆయన విశాల భావాల్ని ప్రశంసించక తప్పదు."

**– నేతాజీ సుభాష్ చంద్రబోస్**

"ప్రజలకు స్వాతంత్ర్యం సిద్ధిం చాలంటే, అందుకు పోరాటమే మార్గం. యుద్ధం చేస్తేనే కాని స్వరాజ్యం రాదు. అది సాధించగల అంగబలం నాకుంది, ఆయుధబలం కావాలి. అందుకే, నేను ఉపక్రమిస్తున్నాను."

**– అల్లూరి సీతారామరాజు**



కాలం ఏదైనా కానివ్వండి. ప్రవాహంలో కొట్టుకుపోయే కోట్లాది జీవులు ఉంటారు. ప్రవాహానికి ఎదురీది నిలిచే అరుదైన వ్యక్తు లూ ఉంటారు. అణిచివేతని మౌనంగా భరించే సామాన్యులు ఉంటారు. అలాకాక ఆక్రందనల్ని నిరసిస్తూ శక్తికొద్దీ నినదించే అసామాన్యులూ ఉంటారు.

చరిత్రను అలాంటి అసామాన్యులే మలుపు తిప్పుతారు. సామాన్యుల వైపు నిల్చి న్యాయం కోసం ఎంత దూరమైనా వెళతారు. ప్రాణాలకు తెగించి మరీ ధర్మబద్ధంగా వ్యవహరిస్తారు. జీవితానికి కొత్త అర్థాన్ని సృష్టిస్తారు. వారినే మనం చారిత్రక వ్యక్తులంటాం.

అంటే, ప్రతీ తరమూ తప్పని సరిగా గుర్తుపెట్టు కోవల్సిన వారని అర్థం. అల్లూరి

సీతా రామరాజు అలాంటి చారిత్రక వ్యక్తి. యావత్ తెలుగుజాతి ఎప్పటికీ గర్వించ దగిన మానవోత్తముడు. మొత్తం భారతదేశం ఎన్నటికీ గుర్తుంచుకునే మహానుభావుడు. ఆదివాసీ రైతాంగ పీడితుల దిక్సూచతడు.

అల్లూరి సీతారామరాజు ఈ దేశపు విప్లవాత్మక ధిక్కారానికి ప్రతీక. అణగారిన ప్రజలపక్షాన నిలిచిన తొలి ప్రజాపక్ష బుద్ధి జీవుల్లో ఒకడు. కేవలం బ్రిటీష్ వారి పై మాత్రమేకాదు. వ్యవస్థ లోని అసమానతలు, అన్యాయాలు, దోపిడీ, పీడనలకి వ్యతిరేకంగా పోరాడిన యోధుడు.

విశాఖపట్నం జిల్లాలోపాండ్రంగి అనే గ్రామంలో 1897, జూలై 4న జన్మించిన అల్లూరి సీతారామరాజు కేవలం 26 ఏళ్ళు మాత్రమే జీవించి, 1924, మే 7 న బ్రిటీష్ వారి ద్రోహనికి బలై పోయాడు. అతిచిన్న వయసులోనే అనితర సాధ్యమైన అంకిత భావంతో,దేశం పై అకళంకిత ప్రేమతో ప్రాణాలర్పించాడు.

సీతారామరాజుది కేవల పితూరీ కాదు. కుల మతాలకి అతీతంగా, ప్రాంతీయ లింగ భేదాలు లేకుండా, రాజకీయ పక్షాలకి దూరంగా, వ్యసనాలకు వ్యతిరేకంగా, ఒక మంచి మానవ సమాజం కోసం అల్లూరి సాగించినది సుస్థిరత కలిగిన నూతన ప్రజాతంత్ర వ్యవస్థ కోసం నిర్మాణాత్మక పోరాటం.

మిరపకాయ టపా పేరుతో ముందుగానే వార్త పంపించి మరీ పోలీసుస్టేషన్ల పై దాడి చేసే అతడిది అరుదైన విప్లవాచరణ. యావత్ బ్రిటీష్ సామ్రాజ్యవాదం పై సాంప్ర దాయబద్ధ ఆయుధాలతో అతికొద్ది మందితో మొట్ట మొదటి తిరుగుబాటు చేసిన తెలుగు సైన్యం అల్లూరి.

అంతటి మహోన్నత వ్యక్తి తెలుగులో తొలి గెరిల్లా యుద్ధతంత్రం నడిపిన సేనాని, బ్రిటీష్ పాలకుల మోసపూరిత వైఖరితో వందేళ్ళ క్రితం హత్య కావించబడ్డాడు. స్వాతంత్ర్యానికి మూడుదశాబ్దాల ముందే అమరుడయ్యాడు. తెలుగుజాతికి దారిచూపే వెలుగు దివిటీగా మారాడు.

భగత్‌సింగ్, నేతాజీ వంటి నేతలతో సమాన మైన అల్లూరి సీతారామరాజు త్యాగానికి తెలుగువారి నిర్లక్ష్యం, నిస్తబ్దత కారణంగా సరైన గుర్తింపు లభించలేదు. అల్లూరి సీతారామరాజు జీవిత విశేషాల్ని పరిరక్షించే చారిత్రక ప్రయత్నాలు ప్రభుత్వం ఆధ్వర్యంలో మరింత సమగ్రంగా, జరగాల్సి ఉంది. మహనీయుడు అల్లూరి భౌతికంగా దూరమై నూరే ళ్ళు అవుతున్న సందర్భంగా ఆస్ఫూర్తిని స్మరించుకోవడం మనందరి కనీస బాధ్యత. అందులో భాగంగా అల్లూరి త్యాగ నిరతిని, ఆశయదీక్షను మళ్ళీ ఒక్కసారి మననం చేసుకుందాం.

మనకోసం మరణించిన అమరుడ్ని మరోసారి మనస్ఫూర్తిగా స్మరించుకుందాం.

----------- X-----------